సంపుటము 2] ఫిబ్రవరి 1916 [సంచిక 8

# బాలమిత్ర

## పొట్టి బాబు

ఒక ఊరిలో నొక పిల్లవాడు గలడు. వాడు దినమున కిరు వదిగంటలు వయస్కుడగుచుండెను. గాని పెరుగుట మాత్రము లేదు. గనుక వానికి పెద్దకోపమువచ్చినది. పొడుగుగా పెరిగి తక్కినవారివలె కనుపడగోరెను. "బాగున్నావా, పొట్టిబాబూ?" అనిపించుకొనుట మహా కష్టముగానుండెను.

ఒకనాడు వానికొక మంచితలంపు వచ్చెను. మాదిగ వాని దగ్గరకుపోయి చెప్పులకు మడిమెలు పెద్దవిగా పెట్టించుకొనినయెడల, ఇంకాకొంచెము పొడుగు కావచ్చునని తలంచెను. అక్కడికి పోగానే మాదిగ గెరటాయ వానిచూచి చాల సంతోషించెను. "పొట్టిబాబూ! బాగున్నారా? ఏంకావాలి?" అని అడిగెను.



"గెరటయ్యా! ఇదిగో నా చెప్పులకు మడిమెలు ఎత్తుగా వేస్తావా? అందరు నన్ను పొట్టిబాబంటున్నారు. అవి పెట్టి పొడుగుండేటట్టు చేయాలి. వాండ్లట్టంటే నాకు మండుతుంది."

"సరే, ఆలాగే చేస్తాను తెమ్మ"ని వాడు వాని చెప్పులకు మడిమెలు ఎత్తుగా పెట్టి, చేతిలో డబ్బు పడవేయించుకొని, చెప్పులిచ్చి "పొట్టిబాబూ, నేను పని బాగాచేయలేదా! మళ్లీ నాకాడికే రావాలె" అని పంపివేసెను.

పొట్టివానికి, ఆ మాటలు వినగానే పట్టరానికోపము వచ్చినది. "వీడు నన్ను చెప్పులు తొడుగుకొనకముందు చూచినాడు గనుక ఈలాగన్నాడు. సత్రము లోకి పోతాను. అక్కడ వారు నన్నాలాగనరులే" అని వాడక్కడకు బోయెను. సైన్యములోని సిపాయివలె నిక్కినిటారుగా లోని పెద్దగదిలోకి పోగానే, సత్రాధికారి వానిజూచి, "పొట్టిబాబూ! నీవా! ఏమి కావలెను? కూర్చొండి, రండి" యనెను. మూలిగే నక్కమీద తాటిపండు పడ్డలాగున పొట్టివాని కుండెను. వెంటనే గిరుక్కున వెనుకకు తిరిగి, చెప్పులవలన కూడా సంగతేమి మారలేదే యనుకొనుచు, ఏమి చేసిన బాగుండునా యని తలంచుచు వీధిగుండా బోవుచుండెను. అక్కడొక టోపీ షాపుండుట చూచి, ఎత్తుటోపీని కొని పెట్టు





కొనిన మేలుగా నుండునని తలంచి లోనికి వెళ్లెను. లోన ప్రవే శించగానే అంగడివాడు, "పొట్టిబాబూ! ఏంకావాలి, టోపీ కావలెనా! రాలోపలికి" అనెను.

"పెట్టుకోగానే అందరుచూచి, పొట్టిబాబని నన్ననకుండా ఉండేటంత పొడుగుటోపీ కావలెను."

సరేనని ఆ అంగడివాడు, ఉన్నవాటిలో పెద్దదిచూచి



ఇచ్చి, వాని తలపై బెట్టి, "బలే బా గున్నవి పొట్టిబాబూ" అనెను.

పొట్టివానికి, వాని మ్రింగేటంత కోపమువచ్చినది గాని, దిగమ్రింగి ఊరకుండెను. "సత్రములో ఇక నీ లాగనరు" అని తలంచుచు, త్వర త్వరగా నడచి సత్రము చేరెను. "పొట్టిబాబూ మళ్లి వచ్చి ంవా? ఎక్కడికి వెళ్లినారు?" అని సత్రాధికారి తిరుగా అడిగెను. అయ్యో పాప మా పొట్టివానికి కలిగిన పరితాప మింతంత ాదు. బోలెడు డబ్బుపోసి, చెప్పులు, టోపీకొన్నా, పొట్టి ంము పోలేదేయని విచారపడుచు, పట్టణములోకి బోయి, జుగారినే, ఎందుకువీడు నన్నిట్లనవలెనో అడిగెదనని బయలు రెను.

మూటముల్లె సర్దుకొని, చంకబెట్టుకొని, ప్రయాణమై

నడిచి, సాయంకాలమునకు, ఒక ఊరుజేరి, సత్రములో దిగెను. ‟పొట్టిబాబూ! దయచేయండి. ఎక్కడ కింత త్వరగా వెళ్లుచున్నార”ని సత్రపువా డడిగెను.

‟పట్నములో రాజుగారితో మాట్లాడుటకు ఎత్తు మడిమెల బూట్సులు, మూరెడు పొడుగుటోపీ పెట్టుకొన్నను, నన్నందరు పొట్టివాడంటారు ఎందు కట్లా అంటారో కనుక్కోవలెను” అనెను.

‟బలె బలే, నేనుకూడా వస్తాను,” నన్ను అందరు, పేద బాపడా అంటారు. ‟దానికి కారణము కనుక్కొనవలెను.” అని గుఱ్ఱపు కోటాయువంక తిరిగి, ‟సోమరి గొడ్డా! లేచి నా జోకిశాకట్టు రాజుగారి దగ్గరికి బోవాలి” అనెను.



కోటడు, ‟అయ్యో నేనుకూడా వస్తాను. నన్నంతె సోమరిపోతా అని అంటున్నారు. ఎందుకో నేనును ఆయ నడుగుతాను” అనెను. సరేనని ఆ ముగ్గురుకలిసి రాజుగా యొద్దకుబోయి తమ మనవులు చెప్పుకొనిరి.

రాజుగారు వారిని పెద్ద హాలులోకి తీసికొనిపోం సత్రాధికారితో, ‟ఇదిగో ఆ అద్దముతట్టు నీవుపెట్టి ఎడ భుజముమీదుగా ఏమి కనుపడుచున్నదో చూడుమ”నెను వాడాలాగే చూచి ‟అరే, పదిపన్నెండుమంది మాయిం

పొరుగుస్త్రీలున్నారే. అదిగో నా భార్య, అందరు, గారెలు బూరెలు తింటూ తమలపాకులు నములుచు, ఊసులాడు చున్నారు” అనెను.

“సరేనోయి! నీ భార్య ఈలాగు కాలము గడుపుచు న్నంతవరకు నీ కదే పేరు” అనెను. తరువాత గుజ్జుపువాడు నిలువబడి ఎడమప్రెపుగా జూచెను. “ఓహో! రెండుకుక్కలు కుందేలుపట్టుకొన పరుగెత్తుచున్నవి గాని అవి ఉదయాన లేవకుంటే పట్టుకొనలేవు” అనెను.

రాజు “నీకు పనిచెప్పినప్పుడెల్లా కుందేలులాగు పరుగెత్తి చేసితే నీ కాపేరు రాదు” అని చెప్పెను.

తరువాత పొట్టివాడువచ్చి అద్దములో చూడగా తన రూపమే కనుపడెను. ఆ రాజుగారి



తో తన రూపము తప్ప మరేదియు కనుపడుటలేదని చెప్పెను. “నీవున్న దానికంటే పెద్దదా అది?” “కాదు, కాదు. నా అంతే ఉన్నది. “సరే, ఇత రులకు ఆలాగే కనుపడుచున్నావు. నీవు పొడుగుగా పెరుగువరకు కొలు ఁకొనుచు, అంతవరకు వారేమన్నను ఊరకొనుము. పొట్టి బాబూ! అంతకంటె మంచిపని లేదనెను.

గాని పొట్టివాని కా మాటలు రుచింపలేదు.

వానివంటివా రింకా ఉన్నారు. మంచిబట్టలు వేసికొన్నంత మాత్రమున గొప్పవారైన వారిని చూచినారా?

---

## ప్రేమయను బాలిక



దక్కన్ ప్రదేశములో వికారాబాదు అను యూరునం ఒక బాలికాపాఠశాల గలదు. ఆ పాఠశాలల ప్రేమయను పేరుగల ఒక బాలిక జినుగుర్తియను గ్రామవ నుండి పంపబడి విద్య నభ్యసించుచుండెను. అయితే య చిన్నదాని దురదృష్టముచే బహు స్వల్పకాలములోనే త దండ్రులవల్ల పాఠశాలనుండి ఆమె యాపబడెను. ఈమెయొక

తల్లిదండ్రులు విద్యాహీనులైనందున విద్యావిషయమైన రుచి వారికి దెలియక నీ చిన్నదానియొక్క మనస్సాక్షికి విరుద్ధముగా బడినుండి ఆపిరి. పాపము! ఆ దౌర్భాగ్యురాలైన యీ బాలిక కేమియుదోచక, తల్లిదండ్రులమాట మీరజాలక యింటియొద్దనిలిచి, తన చిన్నతమ్ముని నెత్తుకొనుచూ తన దల్లికి గృహకృత్యములయందు సయితము సహాయము జేయుచునుండెను. అయినప్పటికిని తాను బోర్డింగ్ పాఠశాలలో నేర్చుకొన్న పాటలు, క్రీస్తునుగురించిన సంగతులు, తనతోగూడి యాడుచుండిన బాలుర బాలికలకు నేర్పుచూ, పాడుచూ, నా పేటలోని వారినందరిని సంతోషింప జేయుచుండెను. అంతకుముందు ఎన్నడెనను క్రీస్తును గురించి వినని యీ జనులు ఈ చిన్నదానివల్ల క్రీస్తునుగురించి కొంతమట్టుకు దెలుసుకొని యుండిరి. అంతలో ఒక మిషనెరీ దొరగారు ముసాపురికి బోయి జినుగుర్తి యను యీ బాలికయొక్క స్వగ్రామము చేరెను. తనవెంటనున్న బోధకులతో గూడి యీ గ్రామములోకివెళ్లి అక్కడి జనులకు క్రీస్తుయేసుని గురించిన ప్రసంగములుజేసి, వారిమధ్యన ఒక కూటమును జరిపెను. అదిన్నిగాక వారిని క్రీస్తుయొక్క మందలోకి చేరునట్లు హెచ్చరించిరి. అప్పుడా ప్రేమయను చిన్నది తనతోగూడి యాడుచుండిన, బాలురను, బాలికలను

గుంపుగా జేర్చి, తాను వారికి నేర్పిన క్రైస్తవ పాటలు అనగా, దేవకుమార దీనోపకార యను కీర్తనను యింకా మరి యితర పాటలను వారితోగూడి పాడుచూ ఆ కూటములోనివారిని ఆనందింపజేసెను. ఆ పాటలు విన్నపుడు మిషనెరీ దొరవారు చాలా ఆశ్చర్యపడి, ,,ఈ చిన్నది ఎవరు? ఇన్నిపాటలు ఏలాగు నేర్చుకొన్నది?" అని విచారించగా, కొంతకాలము క్రిందట యీమె వికారాబాదు బాలికా పాఠశాలలో చదివిన బాలిక యని దెలుపబడెను. అందుకు ఆ దొరవారు బహు సంతోషించి, యీ చిన్నదానిని దగ్గరకుదీసి, ఆమెను వెంటబెట్టుకొని, యింటింటికి వెళ్లి ఆ జనులకు సాక్ష్యము నిచ్చెను. ఆ చిన్నది పాటలు పాడుటయందును, క్రీస్తును గురించిన సాక్ష్యము నిచ్చుటయందును బహు సహాయము చేసినది. ఆ దినమున దాదాపు 200 మంది తన స్వజనులను క్రీస్తుయొద్దకు నడిపించెను.

కాబట్టి సహోదరీలారా, ఈ బాలిక మన బాలికలకు నింకా పెద్దలకు ఒకమాదిరీగా లేదా? ప్రతి బడిలో జదువు చుండే బాలికల కందరికి నిటువంటి హృదయము గలిగి యుండుట మనదేశమునకు ఒక గొప్ప యాశీర్వాదము కాదా?

# ప్రకృతి పాఠములు

ii భాగము

## జంతువులు

### 19-వ పాఠము

### రక్తము వలన కలుగునవి

ఇదివరకు మనము చదివిన పాఠములలో వృక్షములలోని ప్రతిభాగమును రసముచేఁ జేయబడినదని నేర్చుకొనియుంటిమి. గనుక దీనిని "వృక్షపోషకరసము"ని పిలువవచ్చును. నీ శరీరమందున్న ప్రతిదియు రక్తమువలన కలుగుచున్నది. వృక్షమునకు రసమెటులనో, శరీరమునకు రక్తమా విధముగా నుపయోగపడుచున్నది.

బాగుగా వికసించిన గులాబిపువ్వునుగూర్చి చాలకాలము క్రిందట వినియుంటిరి. జ్ఞాపకమున్నదా? కాడలోని గొట్టములగుండా మొగ్గలోకివచ్చిన వృక్షపోషకరసముచే ఆ గులాబిపువ్వేర్పడినది. అదేలాగున చిన్నబిడ్డయొక్క వ్రేళ్లు చేతిలోనున్న గొట్టములదారిని వచ్చిన రక్తముద్వారా పెద్దవాని వ్రేళ్లంతలావుగా పెరుగుచున్నవి.

ఒక చెట్టుకొమ్మను నరికివేసినయెడల అది ఇకనెంత మాత్రము పెరుగజాలదు, కారణమేమి? రసము రాకపో

పుటచేత నేగదా! బహుత్వరలో అది చచ్చును. అదేలాగున ఒక పిల్లయొక్క చేతిని కోసివేసినయెడల అది పెరుగదు. దానిలోకి రక్తమువచ్చు గొట్టములు తెగగొట్టబడినవి. నరకబడిన కొమ్మవలెనే అదియు చచ్చి కుళ్లిపోవును.

వృక్షములనుగూర్చి మనముచదివినప్పుడు, రసముచేత ఎన్నివిధములగు వివిధవస్తువు లేర్పడుచున్నవో చూచి ఆశ్చర్యముతో తెలిసికొంటిమి. చేవకొయ్య, చిగురుటాకులు, ముతకబెరడు ముచ్చటపువ్వులు మొదలగునవన్నియు రసముయొక్క మారురూపములే, అదేలాగున రక్తముతో చేయబడునవి మనము కొంచెము గమనించినయెడల మరీవింతపుట్టును. చర్మమును, వెండ్రుకలు గోళ్లను చూడుము. నోటిలోని ఎర్రనిచిగుళ్లను, తెల్లనిపండ్లను గుర్తించుము. కండ్లవంక పార జూడుము. కనురెప్పలు, కనుబొమలు, కనుగ్రుడ్డుయొక్క గట్టి తెల్లనిపొర, కనుపాపను చూడుము. ఇవన్నియు రక్తముచేత చేయబడినవే. నేనిందాక చెప్పినవి మనకంటికి సాధారణముగా కనుపడునవి, గాని మనకంటికి కనుపడని అనేకములు లోనగలవు. గట్టిఎముకలు, ఎర్రటి కండరములు (కండలు), ఎముకలను అటుయిటు ఊగులాడించు తెల్లని త్రాళ్లు, తేలికయైన ఊపిరితిత్తులు, మందముగానుండు

కార్జము, మెత్తని మెదడు, తెల్లనినాడులు మొదలగునవన్నియు రక్తముతోనే చేయబడుచున్నవి.

చెవిలోనిగులిమి, రక్తముచేకలిగినది. చేదుగానుండు పైత్య రసమును కార్జములో రక్తమునుండి చేయబడినది. కంటి నుండివచ్చు కన్నీరు రక్తముచేతనే కలిగినది. రక్తము ప్రవ హించు గొట్టములు, రక్తమును పంపు గుండెకాయ అంతయు రక్తముతోనే చేయబడినవి, ఎంతచిత్రము. నీరును ప్రవహింప చేయు గొట్టములును, నీళ్లమరయు నీటితో చేయబడునా? గాని రక్తపుగొట్టములు మర రక్తముతో చేయబడినవి.

---

## చంద్రుడు, నక్షత్రములు

మన పరమతండ్రియగు దేవుడు రాత్రివచ్చినప్పుడు మన లను చీకటిలో వదలివేయడు. ఆయన నక్షత్రము లను ప్రకాశమానమగు చంద్రుని సృజించి వాటికిని పనుల నేర్పరచెను. అవి ఆకాశము నలంకరించి సూర్యు డస్తమిం చినపిదప దానిని వెలిగించుట ఆ పనులలో నొకటై. ఎప్పు డైనను ఎండలో అద్దమునుంచి, సూర్యుని ప్రతిబింబము నేల మీదను, గోడమీదను, చీకటి మూలలను పడునట్లు చేసియుం

టివా? నక్షత్రములును, చంద్రుడును చేయుపనియు అలాటిదే. అవి సూర్యకాంతిని ప్రతిఫలింపజేయుచున్నవి. అవి



సూర్యునివలె ప్రకాశించు మిక్కిలి వేడిగల గోళములుగాక మనము నివసించు భూమివలెనే ఉండు లోకములైయున్నవి. చంద్రుడు, సూర్యకాంతిని ప్రతిఫలింపజేయు పెద్దగోళమై యున్నాడు. అది ఎల్లప్పుడును గుండ్రముగా కనుబడకుండుటకు కారణముగలదు. సూర్యునికాంతి గుండ్రముగానుండు

వస్తువుమీద పడినయెడల ఒకప్రక్కనుమాత్రమే పడి ప్రజ్వ లింపజేయును. భూమియు, చంద్రులును తమచుట్టు తిరుగుచు, కదలుచున్నందున, ఒకసారి సన్నని చీలికలాగునను, మరియొకసారి నారింజబద్దవలెను, ఒకసారి రూపాయవలె గుండ్రముగాను కనుపడుచున్నది.

---

# బైబిలు పిల్లలు

## బెన్యామీను

బాలమిత్రులారా! మన మిప్పుడు యోసేపు తమ్ముడగు బెన్యామీనును గురించి పరిశుద్ధ లేఖనమందు ఏమి యున్నదని నేర్చుకొందము. మనలో అనేకుల కీ కథలు మున్నే తెలిసియుండుటచే దీని చదువుట కిష్టములేక పోవచ్చును. అయితే పలుమారు పరిశుద్ధలేఖన పఠనము జేయుటవలన పెక్కులాభములు కలవని మన మెరిగియుండవలెను గదా!

ఈ పిల్లవాడు పుట్టగానే వీనితల్లి అధిక వేదన భరింపజాలక మృతినొందుచు వీని బెనోనియని పిలువుడీ అనెను. బెనోని యన కష్టకాలపుత్రుడు అని యర్థము. అయితే యాకోబు వీని బెన్యామీనని పిలిచెను. బెన్యామీననగా ఎడమచేతితో పనిచేయు

పుత్రుడని యర్థము. బెన్యామీను గోత్రకులందరు ఎడమచేతితో కుడిచేతికంటే బలముగా పనిచేసిరి. యోసేపునకు బెన్యామీను మీద చాలా ప్రేమ. అయితే అతడు తన అన్నచే అమ్మబడి నపుడు ప్రియసోదరునివిడిచి కొన్నియేండ్లుండవలసి వచ్చెను. అయితే కొంతకాలమైన తర్వాత యోసేపు గొప్ప అధిపతిగా ఐగుప్తులో నున్నప్పుడు యోసేపు బెన్యామీనును బహు యుక్తిగా తనయొద్దకు రప్పించుకొని ఇతర సహోదరులకంటె ఐదురెట్లు అధికముగా జూచెను. బెన్యామీను చరిత్రము సవిస్తరముగా లేఖనమందు తెలుపబడలేదు. అయితే ఇతడు తన అన్న చేతను, తండ్రిచేతను మిక్కుటముగా ప్రేమించబడెను. మనమును ఇతరులచేత ప్రేమించబడునట్టి ప్రవర్తన ప్రవర్తించు చున్నామాయని ప్రశ్నించుకొని చూతుముగాక. యాకోబు మరణశయ్యమీద ఇతని ఆశీర్వదించిన ఆశీర్వచనముబట్టి ఇతడు తోడేలువంటి క్రూరస్వభావము గలవాడని గ్రహించు చున్నారము. క్రూరత్వముండుట మంచిదికాదు. దయతో ఎట్టి కష్టపనినైనను స్వాధీనపరచుకొనవచ్చును. ఇతని సంతా నికులు దయలేని క్రూరులు గాన ఒకేసారి చాలామంది దాదాపు అందరు నిర్మూలపరచబడినట్లు న్యాయాధిపతుల గ్రంథమందు చివరి అధ్యాయములలో చదువుచున్నాము.

న్యాయస్థుడైన ప్రభువు చెడువారిని శిక్షించునని నేర్చుకొందము.

---

## బాలమిత్ర టపా

ప్రియ బాలపుత్రులారా!




మా మిశమ్మగారికి పత్రిక సంపాదకురాలుపంపిన ఆ చిన్న పుస్తకమును మేముచదివి గ్రహించి మా స్నేహితులకు హిందువులకును అన్యజనులకును వినిపించినాము.

మేము చిన్నప్పటినుండి బాలమిత్ర చదువుటకు శక్తికలిగి యున్నాము. నేను ఇప్పుడు నర్సరావుపేటలో, యే. బి. యం స్కూలులో చదువుచున్నాను. నేను యిప్పుడు 6 వ తరగతి చదువుచున్నాను. ఇక్కడ తెలుగు ఇంగ్లీషుభాషలు రెండు నేర్పుచున్నారు. నేను మీయందరికొరకు ప్రార్థించుచున్నాను. ఇక్కడ మాబడి మానేజరుయగు మిసిస్. యస్. కే. సిల్క దొరసానమ్మ మావిషయము శ్రద్ధతీసి మమ్ములను బాగ ప్రేమించుచున్నారు.

ఇక్కడ ఆదివారము మా పాష్టరుగారివలన మంచి ప్రసంగము వినిపించబడును. సాయంత్రము 3 గంటలకు క్రైస్తవయత్న సమాజ కూటముకలదు. మరియు, రాత్రి "బాలురయుక్తభ్యాసకూటము" ఒకటికలదు. అందులో మేము బోధించుటకును పాడుటకును తర్ఫీతు చేయబడుదుము. ఈ కూటములో 45 గురు కలరు.

నాకొరకు ప్రార్థించుడి. సలాములు.

ఇట్లు మీ ప్రియబాలమిత్రుడు,
బొంతా జోసెఫ్ రత్నము,
నర్సరావుపేట

C. L. S. PRESS, MADRAS—1916